శ్రీరస్తు.

# సోమ శతకము

ఇది,

కొండ్రింగి బోర్డు ఎలిమెంటరీస్కూలు

ద్వితీయోపాధ్యాయులగు

శ్రీమాన్

## కంతిమంత్రి నరసింహదాసు

గారిచే రచియింపబడి,

## నిష్ఠల సింహాచల కవిగారిచే

సవరణచేయబడి,

---

విశాఖపట్టణంబున

శ్రీ శారదామకుట ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి, ప్రకటింపంబడియె.

మొదటికూర్పు 250] [ఖరీదు 1 అణా

January 1917.

# రాజపోషకులు.

---

1 మ॥రా॥రా॥శ్రీ॥ రాజా సాగి జోగిజగన్నాథ రామచంద్రరాజు గారు, మొఖాసాదారు, పాండ్రంగి.

2 ,, రాజా సాగి ఉప్పలరాజుగారు, మొఖాసాదారు, పాండ్రంగి.

3 ,, రాజా సాగి సన్యాసిరాజుగారు, మొఖాసాదారు, పాండ్రంగి.

4 ,, రాజా దంతులూరి సూర్యనారాయణరాజుగారు, మొఖాసాదారు, ఆనందపురము.

5 ,, రాజా భూపతిరాజు జోగిజగన్నాథరాజుగారు, మొఖాసాదారు, రేవిడి వెంకటాపురము.

6 ,, రాజా భూపతిరాజు వేంకటకృష్ణంరాజుగారు, డిటో.

1-1-17, పాండ్రంగి. } సజ్జనవిధేయుండు కంఠిమంత్రి నరసింహదాసుడు.



శ్రీరస్తు.

# రామశతకము.

——(౦)——

## కంద పద్యములు.

శ్రీరామా నిను నమ్మితి। శ్రీరామా యనుచు ని
న్ను ♦ సేవించెదమదిన్। శ్రీరామా నను గావుము। శ్రీ
రామా నీవెదిక్కు ♦ శ్రీహరి రామా॥ 1

మందుఁడను దురితాత్ముఁడ। గ్రందుగ నీపాదభ
క్తి ♦ గల్గుటచేము। న్నిందుల తప్పులదిగనిడి। సందేహము
మాన్పుమయ్య ♦ సరగున రామా॥ 2

శ్రీరామా నీకృపచే। ఘోరంబగు పాతకంబు కుంఠి
తముగదా॥ నేరము నాయందుండిన। కూరిమితో నన్ను
గాచు ♦ కొనుమా రామా॥ 3

రూపము నామంబేమియు। జూపునకుఁ గానరా
దు ♦ చోద్యంబలరన్। ప్రాపని నీనామంబును। ప్రొ
ద్దును దలచుచుంటి ♦ హృది నిన్ రామా। 4

ఇందీవరదళ నేత్రా। కందంబులచే కృతిశత ♦ కం
బును నేడున్। డెందమున జేయదలచితి। నందార్భక న
న్నుగావు ♦ నమ్మితి రామా॥ 5

సుందర రూపముజూపుచు। నందాదుల తోడగూ
డి ♦ నాడు ముదముతో। బృందావనమందున నా। నంద
మునను దిరిగినావు ♦ నాయకరామా॥ 6

ఎక్కడ జూచిన నీవే। యిక్కడ నక్కడ నటంచు ♦
నెమరకుండన్। జిక్కుదు వెల్లస్థలముల। నిక్కముగా సా
ర్వభౌమ ♦ నిర్మలరామా॥ 7

ఓరామా రఘునందన। శ్రీరామా పద్మనాభ ♦ శ్రీల
క్ష్మీశా। ఘోరాంధ కారదూరక। ధీరతముగ నిన్నుదల
తు ♦ దేవరరామా॥ 8

నిగమంబుల దెచ్చుటకై। మగమీనమ వగుచు
నీవు ♦ మడుగున బడుచున్నా। గపరి సోమకు జంపియు।
జగముల గొనియాడబడితి ♦ జానకిరామా॥ 9

రద్దేల జేసెదవు నీ। వద్దన నను నిల్పుమయ్య ♦ వా
రిజనేత్రా। కొద్దిటివాడను నిజముగ। నుద్ధునిగను నన్ను
జేయు ♦ నృతినుత రామా॥ 10

డింభకుడగు ప్రహ్లాదుడు। కుంభిని పలుబాధపడగ ♦
గుదురుగనీవున్। స్తంభంబున జనియించియు। డింభకు
గాచితి కడింది ♦ ధిరతరామా॥ 11

ద్రౌవది పుట్టమునభలో। పాపాత్ముడు గురువిభుండు ♦
పనివడి యొలువన్। గోపాలక యక్షయమని। యాప
దలికి వరమొసంగి ♦ తొగదరామా॥ 12

యాదవ కులమెల్లనున। న్మోదముతో నుద్ధరించి ♦ మునుకొనినిందా। వాదాన్విత దుష్టాత్ములు। చేదించియు బ్రోచినావు ♦ నృష్టిని రామా॥ 13

ఎత్తితి జన్మములన్నియు। మొత్తముగా సకలపాప ♦ ములజేసితిద। లొక్కెత్తెదు నీమృదుపదములు। జిత్తము లో దలచుచుంటి ♦ సీతారామా॥ 14

సురనరవర విద్యాధర। గిరికరిమృగ పక్షిసర్ప ♦ కీటక తృణకిం। పురుషులయందును సతతము। నెరవరివై దిరుగుచుందు ♦ వేదుక రామా. 15

గోపరిపాలక సద్గుణ। భూపాలక కంసహరణ ♦ పుర హరవినుతా। శ్రీహరిపాలక బ్రోవవె। నాపాలిటి దైవమనుచు ♦ నమ్మితిరామా॥ 16

బాల్యంబున సిలనుగనియు। హేల్యా శాపంబునణచి ♦ యాజానకినిన్। కళ్యాణంబై తిరముగ। బాల్యంబున మెలగితీవు ♦ భార్గవరామా॥ 17

ఓ హాహా రామాని న్నే। సాహసముగ నమ్మినాను ♦ సకలేశ్వరనా। కూహకములు మాన్పుము శ్రీ। మోహనరాయా దలంతు ♦ ముద్దులరామా॥ 18

వరజమదగ్ని కుమారక। పరసాధక పరశురామ ♦ పాపహారణభూ। సురకార్తవీర్యభంజక। సురచందన నన్నుబ్రోవు ♦ సుకుచిర రామా 19

నీకంటె పరులు ఎవ్వరు। లోకంబున లేరు సుమ్మి ♦ లోకేశ్వర శ్రీ। వైకుంఠ నాథనిన్ను। నేకంటిని సత్యము గను ♦ నిర్మల రామా॥ 20

కరిమొర లిడుచుండగవిని। పరుగున నేతెంచినీవు ♦ కాగుగ దానిన్। ధరలో రక్షణజేస్తివి। పరమాత్మా నిన్ను బొగడ ♦ వశమా రామా॥ 21

ఈజన్మమందు దలచక। నేజన్మమునందు లేదు ♦ ఏమార్గంబున్। భూజననుత నినునమ్మితి। నీజన్మము నందు పరము ♦ నీకు నె రామా॥ 22

దివిజుల రక్షణకొఱకై। భువి సీతను బెండ్లియాడి ♦ పావనుగనంతన్। రవితనయుని గలసికొనుచు। కవిసిష్యుల గూల్చినావు ♦ గదరా రామా॥ 23

దనుజాంతక సురరక్షక। వనజాయతనేత్ర నీదు ♦ పావనచరితం॥ బనయము గ్రోలుచునుంటిని। జననుత నను గావుమయ్య ♦ సద్గుణ రామా॥ 24

భక్తుల బ్రోచెడి దొరవని। శక్తికి దగినట్లునిన్ను బూజెనసాపుడున్। భక్తావనగుణ నీపద। భక్తుడ వన్నేలుమయ్య ♦ పావన రామా॥ 25

గర్భస్థుండగు జీవుని। నిర్భయముగ గాచునట్టి ♦ నీరజనాభా। నిర్భాగ్యమైన తనువును। దుర్భరమగు బాధలందు ♦ ద్రోయకు రామా॥ 26

ఈతనువు నిత్యమనుచున్। పాతకములజిక్కి ఘోర ♦ పాపాత్ముడనై। యేతెరవు గానకుంటిని। ప్రీతిగనను గావుమయ్య ♦ వేడెదరామా॥ 27

దేహేంద్ర జాలమందున। మోహంబున జిక్కియుంటి ♦ గుణిజనవినుతా। ద్రోహపు చింతలన్నియు। బాహిరగత జేయుమయ్య ♦ భద్రుడరామా॥ 28

శ్రీవరమేశ్వరవందా। పాపహరణ భూజనునుత ♦ పావనచరితా। తాపనివారణ భూవర। నీపదములె నమ్మియుంటి ♦ నిక్కమురామా॥ 29

అష్టాంగ యోగమెల్లను। గష్టంబని చాలనెంచి ♦ కడకదియెల్లన్। యిష్టంబు లేకనీకై। సాష్టాంగము జేతునయ్య ♦ సద్గుణరామా॥ 30

అజ్ఞానంబున దిరుగుచు। సుజ్ఞానము మరచియుంటి ♦ సుందరరూపా। ప్రజ్ఞాన బ్రహ్మమిచ్చియు। నజ్ఞానము బాపుమయ్య ♦ యచ్యుతరామా॥ 31

కరివర వరదుడననినను। మరిమరి దలతును మురహర ♦ మరువక మరినా। మొరవిని కృపగను నిరతము। నరహరి నీపదకమలము ♦ నమ్మితిరామా॥ 32

గురుపాదంబును బట్టుచు। మరవక నీమంత్రరాజ ♦ మహిమలజాలన్। గురుతుగ జూచుచునిత్యము। దరిగనుచును ముక్తికొరకు ♦ దలతునురామా॥ 33

ముద్రల యోగముజేయుచు। తద్రూపము గనుగొ
నంగ ♦ దరుచుగ సుజనుల్। చిద్రూపము చిన్మయము
ను। భద్రంబుగ జూతురయ్య ♦ పావనరామా॥ 34

నరరక్షక నినునమ్మితి। సురక్షక నీకెదిక్కు ♦ సుంద
రరూపా। కరిరక్షక నామొఱవిని। సిరిరక్షక కరుణజూ
డు ♦ శ్రీహరిరామా॥ 35

శరమొక్కట గొనివాలిని। కరమొప్పగ ధరనుగూ
ల్చి ♦ కనుగొని రవిజున్। ధరకిష్కింధకు రాజుగ। సురుచి
రముగ జేసినావు ♦ సూరఘురామా॥ 36

స్థూలాది సూక్ష్మకారణ। జాలంబున బహుచనుం
టి ♦ సద్గుణచరితా। లీలత్వో నీమహిమంబులు। జాలుగ
వర్ణింపనైతి ♦ నదమలరామా॥ 37

శ్రుతులందును యతులందును। నితిహాసములందు ని
లచి ♦ యింపుగ మఱియున్। స్మృతులందును శాస్త్రము
లం। దతులితముగ నుందువయ్య ♦ హరిశ్రీరామా। 38

మాయా ప్రపంచమందున। బాయక నేవేళలందు ♦
బరగుచునుంటిన్। కాయము నిత్యంబనుచును। నోయుచు
నీపూజజేతు ♦ రోజును రామా॥ 39

సోమకమర్దన కానన। భీమములం దెల్లదిరిగి ♦ సీతను
జూడన్। సౌమిత్రి వెంటగొనుచును। భీమదితిదనుజులను
జంపి ♦ తివిరా రామా॥ 40

త్రిగుణమ్ములచేత బరగు। నగణితముగ సృష్టియెల్ల ♦ నద్భుతమలరన్। సాగను గ నీలో వెల్గును। ఖగవాహన నన్ను బ్రోవు ♦ గనుచున్ రామా॥ 41

దశవిధ నాదములందును। వశముగ నీవుందువయ్య ♦ పావనచరితా। శశిరవిలోచన నిన్నున్। పశపతిచు కొనం గనాకు ♦ వశమా రామా॥ 42

హరి నీతారక నామము। నరుద్రబీజంబులుందు ♦ నమటను నాశం। కరునకు నీకును భేదము। వరునగ నెంచుట కెవరికి ♦ పశమా రామా॥ 43

అర్థజ్ఞానము లేకయు। ధార్థము నీపాద సేవ ♦ తప్పక నెపుడున్। సార్థకము జేయుచుండగ। వ్యర్థునిగా జేయ నగునె ♦ పావనరామా॥ 44

భానుడు మండలమందున। బూనికతో వెలుగుచుండి ♦ పృథ్వీస్థలినిన్। జ్ఞానము వెలిగించునటుల। బ్రాణము వెల్గించెదవుర ♦ వరదా రామా॥ 45

కనుపలి పట్టిన్నిగ్గకొని। కరణీయంబైనయట్టి ♦ కార్యము నీవున్। కరిమాచలంబు కరణిన్। నరవర దుర్జనులనెల్ల ♦ నణచవె రామా॥ 46

పదిదశములందు నొప్పుచు। ముదమున నుప్పొంగుచుండి ♦ పూర్ణుడవగుచున్। వదలక నాలోనుండగ। హృదయంబున నిన్నుదలతు ♦ పృథ్వీరామా॥ 47

దివకర వంశమునందున। జనునుత దశరథునకు ♦
జన్మడవగుచున్। జనకజకై విల్లుదునిమి। మానుగీర్తి వ
హించినావు ♦ మునినుతరామా॥ 48

చరితములు జేయువాడన। హరిస్మరణము గొంచమైన ♦ నాడకయుంటిన్। గురుతుగ నానేరముగని। మరువక గణింపుమయ్య ♦ మాధవరామా॥ 49

కరివాలంబున జేకొని। హిరణ్య నేత్రుండుదుష్ట ♦ హేతువుచేసన్। సురమునుల నొప్పింపగ। కిరివై తద్దను జుగూల్చి ♦ కేరవెరామా॥ 50

సురముని నరనుతదశరథ। వరసుత దశమ ఖవిదళన ♦ వనచరరక్షా। వరమందర ధరమురహర। హరిహరియని నిన్నుదలతు ♦ హరిశ్రీరామా॥ 51

గిరిధర నీమాయ దెలియ। సురాసురులకైన నెందు ♦ జోద్యంబు గదా। చురనేనరుడను కుమతిని। ధరలో నిన్నెంచనాకు ♦ దరమారామా॥ 52

జనపదమున వసియించిన। వనమున నివసించియున్న ♦ వరునగమరియు। స్వదేశ మందునుండిన। సనయము 7 పాడదవుర ♦ హరిశ్రీరామా॥ 53

చెడుగులు జేయుచునిత్యము। గమనిషముల నొందుచుంటి♦ కల్మషరహితా। జడియకుమని యభయంబును। వడిగను నాకిమ్ముభక్త ♦ వత్సలరామా॥ 54

మందరగిరిధర భజగో। విందా హరి పద్మనాభ ♦ వి
ష్ణూ వరదా। సందకుమారక వానున। పొందుగ నిన్నెద
లంతు ♦ పూజిత రామా॥ 55

జనకజవల్లభ నినునే। ననయము గొనియాడుచుంటి ♦
నతిమోదముతో ♦ సనకసనారదసన్నుత। వెనుకటి నేరం
బుగావు ♦ వేగము రామా॥ 56

సురలాదిగ మునులందరు। పరమానందంబునొంది ♦
పరువడి నిన్నున్। సరగున బాడుచునుందురు। ధర నటుప
క్షింప నాకు ♦ దరమే రామా॥ 57

మూడుగుణంబుల మునుగుచు। జాడన్నెనుగక ప్రపం
చ ♦ జాలమునందున్। క్రీడన్ దేలుచు నీపద। జాడన్‌గని
మెలగనైతి ♦ సన్నుతరామా॥ 58

నిత్యము సత్యవ్రతుడవు। ప్రత్యుపకారుండవగుదు ♦ బ
లభద్రా నీ। వత్యంతమగు గురుడవని। నిత్యము నిను న
మ్మినాను ♦ నిర్మలరామా॥ 59

పవనతనూజున్ గూడును। లవణాంబుధి దాటి వేగ ♦
లంకకు జనుచున్। భ [illegible]బులు దిరిగి సతిన్। భవనాశన
దెస్తివయ్య ♦ భద్రుపడ రామా॥ 60

ధనధాన్యంబుల గనుచున్। మనమున సంతుష్టి బొంది ♦
మతిచెడి కుమతుల్। వనజదళేక్షణ నిన్ను। న్నసయము
గానంగలేరు ♦ హరి శ్రీరామా॥ 16

నరహరి నిన్నే నమ్మితి। నరహరి నీకన్న నెవరు ♦ నగప
డరునుమీా। నరహరి నీవే సర్వము।నరహరి నను గావుమ
య్యా ♦ నాయక రామా॥ 62

పాండవుల పక్షమెవ్వడు। దండిగ గాపాడుచుండె ♦ ధర
లో నెపుడున్। మెండుగ బ్రహ్మాండంబున। నిండినవానిని
భజింతు ♦ నిక్కము రామా॥ 63

సత్యంబు పరమమార్గము। నిత్యంబును నీదునామ ♦
మెవ్వరు మదిలో। నత్యంతభక్తితోడను। ప్రత్యక్షము ద
లచువారు ♦ భక్తులు రామా॥ 64

విను మీాషణత్రియంబుల। వినుతింపుచు నుంటి నెపు
డు ♦ విధివశమున నే। కనుమీా భక్తాగ్రేసర। చనుదెంచి
యు దుంచు కర్మ ♦ సమితిని రామా॥ 65

డొంకిన దేహము గడచియు। కింకరజాలంబుచేత ♦ కిత
వులు సడగన్। పంకజలోచన భక్తుని। కింకరవధలేక నీవు♦
కృప గను రామా॥ 66

ఏరీతి కరిని గాచితి । వేరీతిగ సురల బ్రోచి ♦ తీవారి
తిన్। దారిద్ర్యకలితుడను సుమ। కూరిమిఁ రక్షింపుమయ్య♦
కోరితి రామా॥ 67

చక్కగ నీమ్మదుకమలము। మక్కువతో హృదయ
మందు ♦ మానక నెపుడున్। గ్రిక్కున జేరిచి కొలిచెద।చి
క్కుల బడకుండ జేయు ♦ సీతారామా॥ 68

పరులన్ బాధించుటయును। పరధనముల కాసబడు
చు ♦ పగగొనుచును స। త్పురుషుల నిందించుటయును।
పరదాయక నీచునకును ♦ బను లివి రామా॥ 69

గిరిధర కరివర మురళీ। ధర భయహార నరవర పర దా
యక కృష్ణా। సరగున నను గరుణింపవె। పురహారవినుత
శుభచరిత ♦ పూజిత రామా॥ 70

చచ్చిన బుట్టినగానీ। వచ్చేదియునేమిలేదు ♦ వసుధాస్థ
లినిన్। సచ్చరితులగుచున్మనుజనుల్। హెచ్చుగ నిను దలవ
వలయు ♦ హరి శ్రీరామా॥ 71

జ్ఞానుల మనుచున్గొందరు। జ్ఞానులజేరక వితండ ♦ సా
ధనులగుచున్। బూని మనంబున విషయ। ధ్యానంబే సలు
పుచుంద్రు ♦ దశరథరామా॥ 72

పిండాండబ్రహ్మమంతయు। ఖండాఖండములుగాక ♦ క
డకది యెల్లన్। మెండుగ నంటట నుండగ। దండిగ నినున
మ్మినాను ♦ ధరలో రామా॥ 73

దేవాదిదేవ నన్నున్। గావవె నీనామ మెపుడు ♦ గ్రి
క్కున్దలతున్। పావనచరిత్ర నిర్మల। భావజనిత యార్త
రక్ష ♦ పాలన రామా॥ 74

సత్వగుణాతీత పరమ। తత్వములకు నిలయుడవగు ♦
తారకనామా। సాత్వికులందు మెలగి మా। ధత్వజనంబుల
నిజంబు ♦ డాయవు రామా॥ 75

వందనమురః రఘునాయక। వందనమురః సార్వభౌమ •
వనరుహనేత్రా। వందనమురః నరకాంతక। వందనమురః భ •
క్తవరద • పావన రామా॥ 76

ఆరుగురు శత్రువులచే। ఘోరంబగు దుఃఖమెల్ల • గు
డుచుచునుంటిన్। భూరిదరిద్రుండను నీ। ధారుణి నను గా
వుమయ్య • దశరథరామా॥ 77

దశరూపములన్ బొందుచు। వసుమతిలో నిలచియుం
డి • వసుదేవసుతా। పొసగన్ సద్భక్తజనుల। మసలక రక్షిం
తుసికు • మతమిది రామా॥ 78

అలి న్బిడ్డలజూచియు। జాలుగ ధనధాన్యములను • సర
విని గనుచున్। జాలిన్ బడుచు న్నిత్యము। లీలతో నిను
గానలేరు • లేశము రామా॥ 79

నారాయణ శంకర హరి। నారాయణయనుచు నిన్ను •
ననవరతంబున్। తిరుగ నాత్మన్ దలతును। కారుణ్యముజూ
య్య • కరినుత రామా॥ 80

నాభీసరోజమందున। బ్రాభవమై గుల్కు నట్టి • పంకజ •
భవునిన్। యాభువి గల్పించియు తా। మ్మ్యాభారము దాల్చి
నావు • మురహర రామా॥ 81

సకలేశ్వర కటణింపవె। ప్రకటపరాపర కటంప్రి • పర
ద ధరేంద్రా। యకలంకమహిమనిలయ క। నికరనిదానపర
తత్త్వ • నిర్ణయ రామా॥ 82

ఆద్యంతశూన్య శ్రుతితతి। వేద్య సకలధర్మసూత్ర॰విమ
లచరిత్రా। విద్యావిద్యావిరహిత। తథ్యము నిను నమ్మినా
ను ♦ దశరథరామా॥ 83

ఓకల్మషరహితా హరి। భీకరశాత్రవులనెల్ల ♦ బీరత్వ
ముచే। బోకార్చి సురలకొరకై। శ్రీకరముగ వెలసినావు ♦
సృష్టిని రామా॥ 84

కపిసేన లంకచుట్టును। చపలత గావించియుండ ♦ జంచ
లమతులై। కపటాత్ములు చనుదెంచిన। నెపమిడివధియించి
నావు ♦ నిజముగ రామా॥ 85

అరయగ విభీషణుడు దన ♦ పురముననుండంగ లేక। శ
రణని నిన్నున్। ధరలో వేడుకొనంగను। కరుణచె గైకొం
టివయ్యా ♦ గనుచున్ రామా॥ 86

ఆరుపురంబుల గనుచున్। ధీరమనస్కులు ధరిత్రి ♦ ది
రముగ నిన్నున్। గోరిభజింపగనే సమ। కూరును కైవల్య
పదవి ♦ గొబ్బున రామా॥ 87

మునిరూపంబునుదాల్చియు। ననుజుని నీవెంటగొను
చు ♦ నలసతితోడన్। వనములకున్ జనుదెంచియు। మును
లతో వెలుగొందినావు ♦ ముదమున రామా॥ 88

రారా గోవింద వరద। నేరా నన్నిట్టులుంచ ♦ మేదిని
యందున్। ధీరాగ్రణి నీకంటెను। భారమును వహింపగల
రె ♦ పరులున్ రామా॥ 89

అవనీజనంబులెల్లరు। భవపాశౌఘంబుచేత ♦ బద్ధులగుచు దా। మవయుచు నినుగనజాలక। పవికీటకనరకమందు ♦ బడుదురురామా॥ 90

వంకజనాభా నీవున్। పొంకముతో వార్ధిగట్టి ♦ మూకలుగొలువన్। లంకను జేరుచు శత్రుని। కింకతో వధియించినావు ♦ కేశవరామా॥ 91

జీవన్ముక్తికి భారము। నీవేయని నమ్మియుంటి ♦ నిశ్చలమతితో। బ్రోవవె భక్తుని నిత్యము। రావె సుశీలన భజింతు ♦ రాఘవరామా॥ 92

సురలెల్ల నిన్ను బొగడగ। సరిగమ పగరిస ధపయని ♦ సరసులు బాడన్। గరుడతురంగధరాధిప। వరదాయక నిన్నుదలతు ♦ వసుధన్ రామా॥ 3

యోగిజనహృదయభవనా। భాగవతపురాణపురుష ♦ వర్ణితరామా। రాగద్వేషవిదూరక। బాగుగ ననునేలుమయ్య ♦ భక్తుడ రామా॥ 94

అజ్ఞానాంధమునెవ్వరు। సుజ్ఞానముచేత దరిమి ♦ సురుచిరముగ నీ। ప్రజ్ఞానంబును జూతురో। యాజ్ఞానులె ముక్తిభాక్కు ♦ లౌగద రామా॥ 95

రామా సరసీరుహనయ।నా మాధవ హరి యుపేంద్ర ♦ యచ్యుత శౌరి।శ్యామలవర్ణుడ వీవున్। సామాన్యుడ వే ముకుంద ♦ సద్గుణ రామా॥ 96

కౌమారంబున జీవుఁడు। రామాయని దలచలేక ♦ రాగద్వేషా। లే మాటికి దలపోయుచు। కామాంధుండగుచు దిరుగు ♦ గదరా రామా॥ 97

క్షీరాబ్ధి దఱుచునప్పుడు। నారాయణ నీ వెనుమ్మి ♦ యమృతము నెల్లన్। సారసముదాయమున కే।పోరాటము లేక నిస్త్రి ♦ మునినుతరామా॥ 98

అనుజుని మూర్ఛను దెల్పుట। కనిలతనూజుండు వేగ ♦ నటసంజీవిన్। వినయమున దెచ్చి యివ్వగ।ఘనముగ దన్మూర్ఛదీరె ♦ కడమన్ రామా॥ 99

తారకమంత్రం బెరిగిన। కారణపురుషులును సర్వ ♦ కాలములందున్। ధీరమతులగుచు నీపద। వారిజములె నమ్మియుండు ♦ వసుధన్ రామా॥ 100

జగతిన్ సకలచరాచర। మగు జీవులయందు భేద ♦ మెంచక మఱియున్। వగవక సుఖదుఃఖంబుల। సొగసుగ వెలుగొందువారు ♦ జ్ఞానులె రామా॥ 101

పంచాక్షరిమంత్రంబును। నంచితముగ మూఁడువేళ ♦ లందు నుడువుచున్।గించిత్తు నిన్నుదలచి య। చంచలులై యుండవలయు ♦ శ్రీహరి రామా॥ 102

ద్వైతాద్వైతవిశిష్టా। ద్వైతములన బరగుచున్న ♦ మతములయందున్। ఖ్యాతి దలిర్పగ నీవున్। భూతలమున నుందువయ్య ♦ పూజితరామా॥ 103

ఏమతమైనను జాలును। కామితదాయక నిజంబు ♦ క
లుషము లేకన్। వేమరకుండగ నిన్నున్। ధీమతులై దలప
వలయు ♦ దృష్టిగ రామా॥ 104

శ్రీకృష్ణాయని యొకపరి। ఏకృత్యములేక నిన్ను ♦ నే నే
వింతున్। నీకృపగల్గిన భువిలో। నాకూరిత లెల్లబాయు ♦ నా
యక రామా॥ 105

గుణవంతుల జేరిన నవ। గుణులైనను జెడక మంచి ♦ గు
ణులగుదు రిలన్। గుణినగుచునుండి ధర నీ।గుణములు నా
మ్మువేగ ♦ గుణనిధి రామా॥ 106

సగుణప్రపంచమునంతయు। నగణితముగ వెల్గునట్లు ♦
నరవర నీవే। సొగసుగ జేస్తివి రాఘవ। సుగుణాకర నన్ను
బ్రోవు ♦ సురనుత రామా॥ 107

శ్రీకరమగు వర్ణద్వయ। మేకరణిన్ జూచినైన ♦ మేది
నియందున్। జేకొని దలచినవారికి।శ్రీకరముగ పదవి గల్గు♦
శ్రీహరి రామా॥ 108

పుట్టినపురుషుని జన్మం। బెట్టిదొ యెరుగంగ లేరు ♦ యె
కాలంబున్, గట్టిగ నీపదములు చే। పట్టిన జెందుదురు ము
క్తి ♦ పదవిని రామా॥ 109

ధీరుండవు నిజముగ గం। భీరుండవు నిర్వికార ♦ విశ్రుత
వగుచున్। శూరత్వంబున మహినిన్। భారంబు వహించినావు ♦ భార్గవరామా॥ 110

కష్టనాతపైత్యములచే । చపలత గొనునట్టి వేళ ♦ శౌరి
యనుచున్ జపముం జేయగజాలను యిపుడే నిను నే దలం
తు ♦ శ్రీధర రామా॥ 111

పంచ బాణ పర్ణశాలకు । నరుదెంచియు మెలగుచుండ ♦
నవనిజ యంతన్ । హరిణము దెమ్మని వేడగ । శరమున్ బడ
గూల్చినావు ♦ సద్గుణ రామా॥ 112

కారణదేహము గాల్చక । ధీరత దుష్కర్మమెల్ల ♦ దీర
దుగాన నే । గోరికలన్నియు విడచియు । జేరి నిను భజింపవ
లయు ♦ శ్రీహరి రామా॥ 113

శరనిధి దాటగ సాగరు । డెరిగియు నొక్కింతదడవు ♦ నె
రు పన్నక దా । మరుగుబడంగను నీవును । శరనిధి నింకించినా
వు ♦ రఘునాయక రామా॥ 114

రక్కసులన్ దునిమి ధరన్ । గ్రక్కున మునివరులకెల్ల ♦
కష్టములన్ । చక్కగ లేకన్ జేయుచు । చిక్కులబోగొ
ట్టినావు ♦ శ్రీహరి రామా॥ 115

సురరాజ కుమారునితో నీ । వరయగ నెయ్యంబు జేసి ♦ య
తిమోదముతో । నరునకు సారధివగుచును । వెరువక గౌర
వుల జంపి ♦ వేసితివి రామా॥ 116

వేదాతీత నిరంత వినోద యఖిలజీవసంగ ♦ నాశ్రితరం
గా । నాదబ్రహ్మానంద యభేద యకల్మష చిదాత్మ ♦ విమ
ల రామా॥ 117

పురహరుమాయను నొకతరి। తరుణీరూపంబు నొంది ♦ ధ
రలో నీవున్।సురలందరు గనుచుండగ।హరిరూపము నొంది
తీవు ♦ హరి శ్రీరామా॥ 118

అంగజజనక పరాత్పర । రంగత్తగరాడ్తురంగ ♦ రాక్షస
భంగా। సంగరధీర పరాత్పర! రంగుగ నను బ్రోవుమయ్య♦
రక్షక రామా॥ 119

కృష్ణుండవు కేవలమును। విష్ణుడవై వెలసి నీవు ♦ విశ్వ
ములోన। స్ఫష్టముచే దుష్టుల మృగ । తృష్ణలవలె జేసిన
ట్టి ♦ దేవుడ రామా॥ 120

వరకౌశికగోత్రశుభా। కర ధరవర కంఠిమంత్రి ♦ ఘన
గృహజుడ నా। నరసింహానామధేయుడ। విరచించితి ముక్తి
కౌలకు ♦ ప్రీతిని రామా॥ 121

అనుదినమును గని దీనిని।విని పఠియింపగను భక్తి వేగ
మె గల్గున్। నిను మది దలచినవారికి। దసరుగ మోక్షము
ను గల్గు ♦ దశరథరామా॥ 122

శ్రీరామచంద్రపరబ్రహ్మార్పణమస్తు.



## దశావతార దండకము

శ్రీ లోకనాథా జగన్నాథ నీదాసదాసుండనై యుండి నీ
మీాద నే నెక్కటిన్ దండకంబున్ మనోవాంఛతో జేయ
నూహించి నీరూపువర్ణించెదన్ రామ యాతారముల్నీవు
యెన్నెన్ని యుక్క దాల్చినా వందుమీానంబవై వారిధింజొచ్చి
యాదుష్టుడౌ సోమకున్ జంపి యావేదముల్దెచ్చి యాబ్రహ్మ
కున్నిచ్చి సంతుష్టుగా జేసియుండన్ మఱిన్నీవు కూర్మావతా
రుండవై మందరాద్రిన్ ధరన్నెత్తి దివ్యామృతంబంత దై
త్యాది దేవోత్తములకిచ్చి సంతోషులన్ జేసినావయ్య
రామప్రభో యంతనుర్విన్ హిరణ్యాక్షుడు న్భూతలంబంత
యుం జాపగాజుట్టిపోవంగ వారాహరూపంబునన్నీవు యా
దుష్టునిన్ద్రుంచియు న్భూతలంబెప్పటిన్ రూపుగావింప దే
వోత్తముల్పుష్పవర్షంబుగుర్పించిరావేళ యిట్లుండ బ్రి
హ్లాదభక్తుండు నీయందె ధ్యానంబునై యుండగా హేమక
శ్యపుండు దుర్మార్గవృత్తిన్ కడున్ శిక్షలంజేయగా నీవు శ్రీనా
రసింహంబవై యుగ్రరూపంబవై దుష్టదైత్యున్ బఱిన్ మా
ర్చి నీభక్తు ప్రహ్లాదు రక్షించియు న్నిర్భయుం జేసి లోకంబు
పాలించుచుండన్ బలిన్ సంహరింపంగ వామనావతారుం
డవై మూడుపాదంబుల న్భూతలంబంతగైకొంచు దైత్యేం
ద్రు పాతాళముంజేర్చినావయ్య నీరూపమేకీర్తివర్ణింతు రా
మావతారుండవై సూర్యవంశంబునన్ గోసలాధీశుగర్భం

